ॐ

## శ్రీ గురుభ్యోన్నమః

## శ్రీ శంకరాచార్య కృత శ్రీ కనకధారా స్తవం

అందరికీ నమస్కారం !

రానున్న అతి కొద్ది రోజులలో శంకర జయంతి పండుగరాబోతోంది. ఆరోజుకల్లా శంకరుల స్తోత్రాలలో ఏదో ఒకస్తోత్రాన్ని తనివితీరా చదివి నలుగురితో పంచుకుని ఆ ప్రభావంతోటే, ఆ తేనెతోఉన్న మనసుతోటే శంకరుల జయంతి జరుపుకోవాలనే ఉద్దేశ్యంతో ఈ స్తోత్రాన్ని నలుగురితో పంచుకుందామని అమ్మవారే ప్రచోదనం చేయగా శంకరులు కూడా ఆశీర్వదించి ఉంటారు. అందుకే ఎన్నో నెలలుగా దీనిపై విచారణచేద్దామన్న నా కోరిక ఇలా తీరడానికి సిద్ధమైంది. **శంకరుల భిక్ష. ఇదే నాపాలిట కనకధార.** అక్కడా ఇక్కడా చదివింది, మన గురువుగారు చెప్పగా విన్నవాటిలో నా అల్ప శక్తికున్న పరిధిమేరకు ఈ స్తోత్రాన్ని నాలో స్థిరీకరించుకోటానికి చేసే ప్రయత్నమిది. ఎవరిమీదా రుద్దటానికో కాదని పెద్దలు గమనించి ఆశీర్వదించండి.

తప్పులున్న చోట పెద్దలను సరిదిద్దమని అర్థిస్తున్నాను. నేను పండితుడను కాను, కనీసం భాషమీద కొద్దిగా కూడా పట్టులేనివాడిని. వాడిన పదాల దగ్గరనుంచి వాక్య నిర్మాణం వరకూ, ఎన్నో వ్యాకరణ దోషాలు, అక్షరదోషాలు ఉంటాయి. ఈ స్తోత్రంలోని శ్లోకాలు చదువుతున్నప్పుడు అందులో వచ్చే స్వామి వారి, అమ్మ వారి నామాలను, వాటి ప్రాశస్త్యాన్ని పూజ్య గురువులు చెప్పగా నా మనస్సులో స్థిరపడినవి, ఇతరవ్యాఖ్యానాలు చదివినప్పుడు నా మనస్సులో ముద్ర పడిన సందర్భాలను, ఈ స్తోత్రం చదువుతున్నప్పుడు నా ఆలోచనలు ఎలా కదులుతున్నాయో దానికి అనుగుణంగా వ్రాసిన వివరం తప్ప ఇది అనువాదం కాదు, తాత్పర్యం కాదు. అవి రాసేంత అర్హత, అధికారము లేని వాణ్ణినేను అన్న విషయం మరో సారి మనవి చేస్తున్నాను. నేను ఎక్కడ పొరపాటు చేసానో చెప్పి నన్ను సరిదిద్ది పైమెట్టెక్కడానికి ఊతమివ్వండి.

జగద్గురువులైన శ్రీ ఆది శంకరుల అవతారంలో ప్రప్రథమంగా సన్యాసాశ్రమం తీసుకోకముందే బ్రహ్మచారిగా ఉన్నప్పుడే లోకోద్ధరణకై చేసిన గొప్ప స్తోత్రమిది. ఈ స్తోత్రం అతి సులభంగా అందరూ పఠించే విధంగా తేలికైన శ్లోకాలతో ఈ స్తోత్రాన్ని ఇచ్చారు. ఈ స్తోత్రాన్ని లోకానికిచ్చేనాటికి వారు అతి చిన్నవారు కానీ అప్పటికే వారు సకల శాస్త్రాలనూ అవగతం చేసుకున్నారు... అలా అనడంకన్నా వారికి జన్మ తహ్ వచ్చినవి కాదు కాదు జన్మ తహ్ ఉన్నవే అంటే సరిగా కుదురుతుందేమో.

ఈ స్తోత్రం శ్రీ శంకరులు సన్యాసం తీసుకున్నాక ఇవ్వకూడదు కాబట్టి దానికి పూర్వమే ఇచ్చారు. ఎందుకంటే ఒకసారి సన్యాసం తీసుకున్నాక ఇక ఎవరూ సన్యాసిని లౌకిక కోరికలు కోరకూడదు కోరినా ఆ కోరికలని ఆ సన్యాసి భగవత్పరం చేయాలి ప్రయత్నపూర్వకంగా కోరికలు తీర్చే స్తోత్రాదులు వగైరాలు ఇవ్వడం అంత కుదరని

పని. కాబట్టే సన్యాసాశ్రమానికి ముందే ఇచ్చారు. మరి బ్రహ్మ చారిగదా బ్రహ్మచారికి ఇటువంటి స్తోత్రాలతో పని ఏముంది అని సందేహం రావచ్చు. బ్రహ్మచారి దానమిచ్చిన వారిని ఆశీర్వదించవచ్చు. బీద బ్రాహ్మణి వద్ద భిక్ష తీసుకున్న తరవాత, లక్ష్మీదేవిని ముగురమ్మల మూలపుటమ్మ గా స్తోత్రం చేసి తన ఆశీర్వాదంగా లక్ష్మీ అనుగ్రహం కలిగేటట్టు దీవించారు. ఈ స్తోత్రం ద్వారా మనకు శ్రేయోభివృద్ధి కలగడానికున్న అడ్డంకులని తొలగతోసుకుని సంసారాన్ని నడపడానికి, దాటడానికి కావలసినవి సమకూర్చుకోడానికి మన జాతికి వారు పెట్టిన భిక్ష ఈ స్తోత్రం.

ఈ శ్లోకాలు అప్పుడెప్పుడో రెండు వేల ఏళ్ళకి పూర్వం జరిగిన కనకధార మనకెలా పనికొస్తుంది అంటే, అప్పుడు వారు చేసిన స్తోత్రంలో బ్రాహ్మణి పేరుకాని ఆయన పేరు కాని పెట్టకుండా ఎవరు చదివినా వారే స్తోత్రం చేసినట్టు అన్వయమయ్యేలా స్తోత్రం చేయడం శంకరుల ప్రజ్ఞ, కాదు వారి ప్రజ్ఞకి తాఖీదులివ్వడానికి మనమెంత. అది వారి అపార కరుణతో కూడిన పరమాన్నపు భిక్ష.

ఇది కేవలం ధనాపేక్షకొరకు మాత్రమే చేయవలసిన స్తోత్రమా? ఇతరులు మోక్షాపేక్ష కలిగినవారు చేయనవసరంలేదా? ముమ్మాటికీ కాదు! కేవలం ధనాపేక్ష కలిగినవారికే ఈ స్తోత్రం శంకరులు ఇస్తే వారు జగద్గురువుగా ఎలా నిలబడతారు. ఈ స్తోత్రంలో వారు పరబ్రహ్మ తత్త్వాన్ని కీర్తించారు. పరబ్రహ్మము యొక్క కారుణ్యాన్ని కీర్తించారు. ప్రారబ్ధాన్ని ఎవరూ దాటలేక దాని వల్ల కలిగిన ఆటంకంతో పుణ్యకార్యాలు చేయలేకపోతున్న వారి ప్రారబ్ధాన్ని పారదోయగల స్తోత్రమిది.

అర్థకామముల నుంచి మోక్ష సామ్రాజ్యము వరకూ ఇవ్వగల స్తోత్రం కనక ధార.

*దురదృష్ట వంతుడిని ఉద్ధరించడం కనక ధార*

*దురితాలని తొలగతోయడం కనకధార*

*ఐశ్వర్యాన్ని అనుభవైకవేద్యం చేయడం కనకధార*

*అమ్మ కారుణ్యానికి దగ్గర చేయడం కనకధార*

*పాపరాశిని ధ్వంసం చేసి మోక్షానిక్వర్హత చేకూర్చడం కనకధార*

*సకల విద్యలనూ కురిపించగల మేఘం కనక ధార*

*కనకధార-కామకోటి*

**గణేశ స్తుతి / హయగ్రీవ స్తుతి :**

**శ్లో!! వందే వందారు మందార మిందిరానంద కందళమ్ !**
**అమందానంద సందోహ బంధురం సింధురాననమ్ !!**

వందనము! గజముఖము తన ముఖముగా కలిగినటువంటి, నమస్కరించువారి లేదా శరణుజొచ్చు వారి పాలిట కల్ప వృక్షము వంటి వాడు, తల్లి పార్వతీదేవి ఆనందమునకు మొలక వంటి వాడు, అమితాశ్చర్యమగు మహానందమును కోరు జ్ఞానులనుద్ధరించువాడు (ఇక్కడ వినాయకుని పరబ్రహ్మ తత్త్వాన్ని వర్ణించారు) ఐన ఆ విఘ్న వినాయకునికి నమస్కారము.

ఇక జగద్గురువులుగా వెళ్ళవలసిన బాల శంకరులు మొట్ట మొదట ఉపదేశంగా పలికిన స్తోత్రాన్ని "వందే" అంటూ మొదలెట్టారు. నమస్కారంతో మొదలు. అంటే జగద్గురువుగా నిలబడబోయే బాల శంకరులు లోకానికి చెప్పిన మొదటి బోధ నమస్కారం చెయ్యమని చెప్పడం.

ఆ నమస్కారాన్ని శాస్త్ర విహితంగా మొదలు వినాయకునికి నమస్సుతో మొదలు చేసిన శంకరులంతవారే వినాయకునికి మొదట చేయవలసిన నమస్కారం, పూజ గురించిన విషయాన్ని సనాతన ధర్మానికి వ్యతిరిక్త కాలంలో ధృవ పరిచారు. అందరూ వినాయకునికి మొదట నమస్కారం చేయవలసినదే.

నమస్కారం అంటేఐదు పంచేంద్రియాలు ఐదు జ్ఞానేంద్రియాలు బుద్ధిని నమస్కారం
ఎవరికి చేస్తున్నామో వారి పరం చేయడం.
నమస్కారం చేయడం అంటే వినయాన్ని ఆవిష్కరించడం.
నమస్కారం చేయడం అంటే భక్తిని ఆవిష్కరించడం
నమస్కారం చేయడం అంటే ఎదుటివారి గొప్పతనాన్ని తనలోని తక్కువతనాన్ని గుర్తించడం.
నమస్కారం చేయడం అంటే ఉద్ధరించమని అర్థించడం..
నమస్కారం చేయడం అంటే అనుగ్రహాన్ని వర్షింపచేసి ఆటంకాలని తొలగ తోయమని అడగడమే..
ఇలా చెప్తూ పోతే నమస్కారం గురించి ఎంతైనా చెప్పకోవచ్చు. (అసలు సుందరకాండలోని గమ్మత్తంతా నమస్కార ప్రభావమే. సుందరకాండలోని మలుపులన్నీ నమస్కారము, స్తుతుల చుట్టూనే తిరుగుతుంటాయి. అందుకే కాబోలు సుందరకాండ ఉపాసన చేసినవారు అంత వినయంగానూ ఉంటారు)

దీనినే ఈ క్రింది విధముగా కూడా అన్వయం చేస్తారు..

తా : నమస్కరించువారి కోరికలు తీర్చు (మందారమను) దేవతావృక్షము వంటివాఁడును, తన పత్నియైన శ్రీ మహాలక్ష్మీదేవి యొక్క ఆనందమునకు మొలక వంటివాఁడును, పండితులు (జ్ఞానులు) అనుభవించు బ్రహ్మానందమునకు కిరీటము వంటివాఁడును అగు హయగ్రీవునికి నమస్కారము చేయుచున్నాను.

**శ్లో1!! అంగం హరేః పులక భూషణ మాశ్రయంతీ**
**భృంగాంగనేవ ముకుళాభరణం తమాలమ్ !**
**అంగీకృతాఖిల విభూతి రపాంగలీలా**
**మాంగల్యదాఽస్తు మమ మంగళదేవతాయాః !!**

తా : ఆడ తుమ్మెద నల్లని తమాల వృక్షముపై వాలినట్లుగా ఏ మంగళదేవత యొక్క ఓరచూపు నీలమేఘశ్యాముడైన భగవాన్ విష్ణుమూర్తిపై ప్రసరించినప్పుడు ఆ వృక్షము తొడిగిన మొగ్గలవలె ఆయన శరీరముపై పులకాంకురములు పొడమినవో, అష్టసిద్ధులను తన వశమునందుంచుకొన్న ఆ శ్రీ మహాలక్ష్మి భగవతి యొక్క కృపా కటాక్షము నాకు సమస్త సన్మంగళములను సంతరించును గాక !

వివరణ: శంకరులు ఇక్కడ ముందుగా విష్ణుభగవానుని నామాన్ని చెప్పి తల్లి లక్ష్మీదేవిని ప్రసన్నం చేసుకునేందుకు చేసిన మొట్టమొదటి శ్లోకం ఇది. తల్లి నిత్యానపాయని కదా విష్ణువుని కీర్తిస్తే తాను ఎక్కువ సంతోషపడుతుంది. ఇందులో శంకరులు హరేః అన్న నామాన్ని ప్రస్తావించారు. వేరు నామాల్ని ఏవీ ప్రస్తావించలేదు. హరి అంటే సకల పాపాలను హరించేవాడు అని కదా అర్థం. ఒకవేళ బీద బ్రాహ్మణి పాపాలు ఎక్కువగా ఉంటే వాటిని తేలికగా తీసేయగలిగినవాడు శ్రీ హరి. అందుకు ఈ నామం వాడారు.

అలాగే తమాల వృక్షం అన్న పదాన్ని వాడారు. తమాల వృక్షాన్ని చీకటి చెట్టు అని అంటారు అది నల్లగా ఉంటుంది. ఊరి బయట సముద్రపుటొడ్డున స్మశానాలలో ఉంటుంది. అందరూ వదిలేసి వెళ్ళినా స్మశానంలో నేనున్నాని చెప్పి పాపపుణ్యాలకతీతంగా జీవునికి తోడుగా స్మశానంలో ఉండేది తమాల వృక్షం. మరి అలాంటి నీలమేఘ సంకాశుడైన విష్ణుభగవానుడు కూడా అంతేగా పాపపుణ్య ఫలప్రదాత/ పాపపుణ్యాలకతీతంగా జీవులని ఉద్ధరించగలడు. అలాగే ఈ బీద బ్రాహ్మణ కుటుంబాన్ని కూడా పాపపుణ్యాలకతీతంగా ఉద్ధరించగలడు. అంతటి గొప్ప కారుణ్యాన్ని వర్షించగల విష్ణుభగవానుడు నీ చూపులు తగిలేసరికి అతని శరీరము పులకాంకితమౌతుంది. తమాల వృక్షానికున్న బొడిపెలలాంటి మొగ్గలమీద ఆడ తుమ్మెద ఎలాతిరుగుతున్నదో అలా నీచూపులు కారుణ్యపూర్తమైన విష్ణుభగవానుని శరీరము మీద సోకేసరికి శ్రీహరికి పులకాంకురాలు కలిగి అవే ఆభరణాలుగా మారాయి.

నీచూపులను అంగీకరించిన విష్ణువుయొక్క మహదానందమునకు కారణమై అఖిల విభూతులకూ సకలైశ్వర్యములకూ పుట్టినిల్లుపైన తల్లీ లక్ష్మీ దేవీ! ఆ చల్లని చూపులు ఒకసారి మావంక ప్రసరింపజేస్తే విష్ణు భగవానుడు అనునయంగా మా పాపాలను తొలగ తోస్తాడు, తద్వారా నీవు మాకు సమస్త మంగళములు కల్గించెదవుగాక !

సందర్భం ప్రకారం: తల్లీ! పాపాలెన్నో కలిగి పుణ్యరాశిలేని ఈ బీదబ్రాహ్మణ కుటుంబ పాపాలను తొలగతోయగలిగిన శక్తిఉన్న దంపతులు మీరు, ఏకాదశి వ్రతం చేసి ద్వాదశి పారణకై వేచి ఉన్నారంటే ఆ శ్రీ హరిని పూజించువారేకదా, దానిద్వారా వారి పాపాలను ధ్వంసం చేయడం మీకు సాధ్యమే. ఇక పుణ్యం విషయానికి వస్తే ఇదిగో ఇప్పడే నాచేతిలో ఉసిరికాయ దానం చేసింది, ఆ కొంత పుణ్యాన్ని కొండంత పుణ్యంగా మార్చే కరుణామూర్తులు మీరు, అది అడ్డం పెట్టి ఈ బ్రాహ్మణ కుటుంబానికి సంపత్తిని కలుగజేసి దారిద్ర ధ్వంసనం చేసి ఉద్ధరించు.

**శ్లో2!! ముగ్ధా ముహుర్ విదధతీ వదనే మురారేః**
**ప్రేమ ప్రపాత ప్రణిహితాని గతాగతాని !**
**మాలా దృశోర్ మధుకరీవ మహోత్పలే యా**
**సా మే శ్రియం దిశతు సాగర సంభవాయాః !!**

తా : ఒక పెద్ద కమలము చుట్టుత ఆగి-ఆగి పరిభ్రమించు తుమ్మెద వలె విష్ణుమూర్తి యొక్క మోముపై వెల్లువలెత్తిన ప్రేమను మాటిమాటికిని ప్రసరింపజేయు శ్రీ మహాలక్ష్మీదేవి కటాక్ష పరంపర నాకు సంపదల ననుగ్రహించు గాక !

వివరణ: ఈ శ్లోకంలో విష్ణు భగవానుని "మురారేః" అని సంబోధించారు బాల శంకరులు. మురారి అంటే ముర అనే రాక్షసుని చంపినవాడు లేదా శత్రువు అని అర్థం. మురాసురుడు బ్రహ్మగారి కొరకై తపస్సు చేసి లోకాలన్నీ జయించటంకొరకు తాను ఎవరినైతే ముట్టు కుంటాడో వారు మరణించేటట్టు వరం ఇవ్వమన్నాడు (ఇంకో విధంగా అన్వయిస్తే తన చేతితో ముట్టుకున్నదేదో తనచే ఓడింపబడాలి అంటే తన స్వంతమవ్వాలి). అటువంటి మురాసురుడు తరవాత దేవతలపైకి దండెత్తి వెళితే దేవతలందరూ పెద్ద యుద్ధంలేకుండానే పారిపోయారు. అమరావతిని సొంతం చేసుకుని విలాసాలననుభవిస్తూ తన వాహనంపై లోక సంచారం చేస్తూ భూమిమీదకు వచ్చాడు. భూమి మీద సరయూ / గంగా తీరంలో రఘుమహారాజు దేవతల కోసం యజ్ఞం చేయటం చూసి కోపగించి దేవతలకు హవిస్సు ఇవ్వరాదు అని ఆజ్ఞాపించాడు, కూడదంటే తనతో యుద్ధానికి రమ్మన్నాడు. అంతలో వశిష్టుడు అనునయంగా మాట్లాడి ఈ భూమిపై జీవులనందరినీ యమ ధర్మరాజు సంహరిస్తుంటాడు కాబట్టి నువ్వు ఆయనతో యుద్ధం చేసి గెలిస్తే అంతా నీదే అవుతుంది అని చెప్పగా మురుడు యమసదనానికి వెళ్ళాడు. మురుని రాక గురించి వశిష్ఠుని ఉపాయం గురించి తెలుసుకున్న యమధర్మరాజు, మురునికి స్వాగతం చెప్తాడు. మురుడు యముణ్ణి యుద్ధానికి ఆహ్వానిస్తాడు యుద్ధం వద్దనుకుంటే భూమి మీద ఎవ్వరినీ చంపవద్దని ఆదేశిస్తాడు. అంత యమధర్మ రాజు మురునితో అలా చేయటానికి తనకి అధికారంలేదనీ చేసినా తన పై అధికారైన విష్ణువు తనను దండిస్తాడని చెప్పగా మురుడు అదేదో విష్ణువుతోనే తేల్చుకుంటానని వైకుంఠం వెళ్తాడు. వైకుంఠం లో క్షీర సముద్రం మధ్యలో విలాసంగా ఆదిశేషుని మీద పడుక్కుని ఉన్న శ్రీ హరితో ఆ మురాసురుడు యుద్ధానికి రమ్మని రంకెవేస్తాడు, జరిగినది తెలుసుకున్న శ్రీహరి ఆ మురాసురునితో యుద్ధం సరేకానీ నాతో యుద్ధమంటే నీగుండె ఎందుకు అలా భయంతో కొట్టుకుంటోంది. నాతో యుద్ధమంటే నీకు భయంలాగుంది అని అనగానే మురుడు తత్తరపడి నాకు భయమా ఎవరిగుండె కొట్టుకుంటోంది అని తన చేతిని తన గుండె మీదపెట్టుకుంటాడు వెంటనే ఆ శ్రీ హరి తన చక్రాయుధంతో మురుని చేతితోసహా ఖండించి సంహరించాడు.

అటువంటి శ్రీహరిని తన సాగరమథనం జరిగినప్పుడు అందులోంచి పైకి వచ్చిన తల్లివైన నువ్వు చుట్టూ ఎంతమంది ఇతర దేవతలున్నారో రక్కసులున్నారో కూడా చూడకుండా ముగ్ధలా అమాయకురాలిలా ఆ

మురాసురుని సంహరించిన ఆ శ్రీహరి ఈయనే అని కన్నార్పకుండా మోహంతో చూసిన చూపులు మాకు సిరిసంపదలు కటాక్షించుగాక. అలా చూస్తున్న చూపులు అందరూ చూస్తున్నారని గ్రహించి , కలువ మీద మళ్ళీ మళ్ళీ వచ్చి చేరే ఆడ తుమ్మెద లాగా, నీ చూపులను మరల్చి మరల్చి, తిప్పి తిప్పి, ప్రేమ + సిగ్గుల దొంతరలతో శ్రీ మహావిష్ణువును ముగ్ధ మోహనంగా చూసిన చూపులున్న ఓ తల్లీ! లక్ష్మీ దేవీ! మమ్ములను నీ ఆ చల్లని చూపులు అనుగ్రహించుగాక!

<u>సందర్భం ప్రకారం:</u> మురాసురుడంటే ఎవ్వరికీ పెట్టకుండా అంతా తనదే అని దాచుకునేవాడు. అటువంటి పాపగుణాన్ని ఎవ్వరికీ పెట్టక అంతా నాది నేను అన్న చేయితో సహా శ్రీహరి నిర్మూలించాడు. పూర్వజన్మలో ఒకరికి పెట్టకనే కదా ఈ జన్మలో ఈ బ్రాహ్మణ కుటుంబం దరిద్రం అనుభవిస్తోంది ఆ దానం చేయని పాపాన్ని శ్రీహరి నిర్మూలించగలడు తల్లీ అని అంతర్లీనంగా మురాసురుని సంహార వృత్తాంతం సంకేతించారు.

**శ్లో3!! విశ్వామరేంద్ర పద విభ్రమ దానదక్ష**
**మానంద హేతురధికం మురవిద్విషోపి !**
**ఈషన్నిషీదతుమయి క్షణమీక్షణార్థ**
**మిన్దీవరోదర సహోదర మిన్దిరాయా:!!**

తా : ఇంద్రాది దేవతలకు ముల్లోకములను అమరావతిని కట్టబెట్టగలిగిన దయతో కూడిన విష్ణుభగవానుని ఆనందమును వృద్ధిచేయు చూపులు కలిగిన తల్లీ, చతుర్ముఖ బ్రహ్మకి సోదరీ ! ఒక్క క్షణము నీ కరుణాపూరిత చూడ్కులు మాపై ప్రసారముచేయుదువుగాక!

<u>వివరణ:</u> ఇక్కడ కూడా విష్ణుమూర్తిని పరోక్షంగా మురారి అని మురవిద్విషోపి అన్న పద ప్రయోగం ద్వారా సంబోధించారు శంకరులు. దానము చేయకుండా తనదిగా అన్నీ దాచుకున్నవానికి శత్రువైన శ్రీమహావిష్ణువు దేవాంద్రాదులకు స్వర్గాది లోకములను తన దయతో దానమిచ్చాడు. ఇది ఎప్పుడు జరిగింది ఎలా జరిగింది అని చూస్తే. ఒకానొకనాడు దుర్వాసో మహర్షి అమ్మవారిచ్చిన పుష్పహారాన్ని చేత బట్టుకుని వెళ్తూండగా దేవేంద్రుడు ఐరావతం మీద ఎదురైనప్పుడు దేవేంద్రునికి మంగళం చెప్పి ఆశీర్వదించి దుర్వాసో మహాముని ఇంద్రునికి అమ్మవారిచ్చిన పుష్పహారాన్ని ఇచ్చారు. తరవాత అహంకారంతో ఉన్న దేవేంద్రుడు ఆ హారాన్ని ఐరావతం మీదకి విసిరి వెళ్ళిపోయాడు. తద్దోషంగా లక్ష్మీ దేవి పాల సముద్రంలోకి వెళ్ళిపోయింది. ఇంద్రుని అహంకారం వల్ల లక్ష్మీ దేవి దేవలోకాన్నే కాక వైకుంఠాన్ని కూడా వదిలి పాల సముద్రంలో చేరిపోయింది. తరవాత ఇంద్రుడు అన్ని బాధలు పడ్డాడు, తరవాత క్షీర సాగర మథనం జరిగి లక్ష్మీ దేవి పైకి వచ్చి శ్రీ మహావిష్ణువుని మళ్ళీ చేరింది(ప్రకటంగా చేరింది, వారిద్దరూ విడివడినదెన్నడు గనక?). అటువంటి అహంకారి, నీ ప్రసాదమైన పుష్పమాలనే తిరస్కరించినవాడు రాజ్య భ్రష్టుడౌతే, స్వయంగా శ్రీ మహావిష్ణువే ఇంద్రునికి తమ్ముడుగా, పన్నెండు నెలలు గర్భవాసం చేసి వామనావతారమెత్తి, ఇంద్రునికి తమ్ముడు కనుక ఉపేంద్రుడను పేరు పెట్టుకుని, ఒకరికి ఇవ్వడమే ఎరిగిన శ్రీహరి, బలి చక్రవర్తి వద్ద చేయిచాచి దానమడిగి మూడులోకాలనూ కొలిచి బలిని పాతాళానికి త్రొక్కి అలా దానంగా సంపాదించిన రాజ్యాన్ని ఇంద్రునికిచ్చాడు. అటువంటి విష్ణుమూర్తి

గుండెలలో ఉండేదానివి నీవు. నీ చల్లని చూపులతో అంత దయగలిగిన విష్ణుమూర్తికే ఎంతో ఆనందాన్ని కలిగించేదానవు. విష్ణు మూర్తి నల్లని కలువ పువ్వైతే అందులోని సౌకుమార్యం అంతా ఆయన దయ. దాని మధ్యలోనున్న దుద్దు అతి సుకుమారం మధ్య భాగం ప్రకాశవంతం ఇంకా చల్లన. చల్లని నల్లని విష్ణుమూర్తి అనే కలువ పువ్వుగుండెలోని అత్యంత సౌకుమార్యమైన అత్యంత చల్లనైన మధ్య భాగం వంటి లక్ష్మీ దేవివినువ్వు. పువ్వుకన్నా మధ్యభాగంలోనే ఆర్ద్రత, చల్లదనం ఎక్కువ. మరి ఆ చల్లని చూడ్కులు మాపై ప్రసారం చేసి మమ్మల్ని రక్షించవా తల్లీ!

<u>సందర్భం ప్రకారం:</u> క్రిందటి శ్లోకంలో చెప్పినట్లు దానం చేయనివారికి శత్రువైన విష్ణుమూర్తి (మురారి), స్వయంగా తానే ఇంద్రునికోసం దానం పట్టి, తద్వారా వచ్చిన దాన్ని ఇంద్రునికి దానమిచ్చేశాడు. శ్రీ హరిగా పాపాలను తీయగలడు కానీ దారిద్రాన్ని తీసి పుణ్యఫలంగా ఐశ్వర్యాన్ని ఇవ్వగల అన్నదానికి ఉదాహరణగా పైన చెప్పిన దుర్వాసో మహర్షి, అమ్మవారిచ్చిన పూమాల, ఇంద్రుడు, క్షీరసాగర మథనం, వామన, బలి చక్రవర్తి కథ మొదలైనవి సూచించారు. అంటే భగవంతుని, భాగవతుల పట్ల చేసిన తప్పునే దిద్ది తిరిగి ఐశ్వర్యాన్ని రాజ్యాన్ని ఇవ్వగల దయ కలిగిన హృదయం కలిగినవాడు శ్రీ మహావిష్ణువు. ఆ చల్లని విష్ణువు గుండెలలో ఇంకా చల్లగా ఉన్న తల్లివి నువ్వు, ఎంతో దయగల మీ ఇద్దరూ,ఈ బ్రాహ్మణ కుటుంబం యొక్క పాపాలను తీసి వీరిని ఉద్దరించి ఐశ్వర్యాన్ని కలుగచేయవలసినది అని శంకరులు ప్రార్థించారు.

**శ్లో4!! ఆమీలితాక్ష మధిగమ్య ముదా ముకున్ద**
**మానన్దకన్ద మనిమేష మనఙ్గతన్త్రమ్ !**
**ఆకేకర స్థిర కనీనిక పద్మనేత్రం**
**భూత్యైభవేన్మమ భుజఙ్గశయాఙ్గనాయాః !!**

తా:అమ్మా లక్ష్మీదేవీ! ఎప్పుడూ ఆనందమునిస్తూ కొద్ది కొద్దిగా తెరచియున్న కన్నులున్నవాడు, మన్మథుని తంత్రమును వశము చేసుకొనినవాడు, ఆదిశేషునిపై శయనించువాడు ఐన మహావిష్ణువు యొక్క పత్నివి నీవు. అర్ధనిమ్మీలిత నేత్రాలతో స్థిరమైన చూపులతో పద్మము వంటి కనులతో శ్రీ మహావిష్ణువును చూచే చూడ్కులున్న తల్లీ మీ ఈ కళ్యాణ రూపము నాకు కళ్యాణ రూపము నాకు కళ్యాణమును కలిగించు గాక.

<u>వివరణ:</u> ఇక్కడ శంకరులు ముకున్ద అన్న పదంతో శ్రీ మహావిష్ణువుని సంబోధించారు. ముకున్ద అన్న పదానికి మోక్షమునిచ్చువాడు అని అర్థము. ఏ సంసార బాధలు లేక కేవలము మోక్షమును కోరే వారు ఆశ్రయించు వాడు శ్రీ మహావిష్ణువు. తాను ఎల్లప్పుడూ అర్థ నిమ్మీలిత నేత్రాలతో తన భక్తులను రక్షిస్తూ వారికి ఆనందము కలిగించేవాడు శ్రీ మహావిష్ణువు. ఐతే ఆ శ్రీ మహావిష్ణువు మన్మథుని తంత్రాన్ని వశము చేసుకున్నవాడు అని ఈ శ్లోకంలో చెప్పారు, అసలు మన్మథుడు ఆయన కొడుకే కదా, ఆ మన్మథునికి ఉన్న శక్తికి కూడా కారణం ఆ విష్ణువే. ఇక ఆయన భుజగశయనుడు, పాము మీద పడుక్కుంటాడు. ఈ రెంటి అర్థం ఏమంటే జనన మరణాలకై అతీతంగా మోక్షాన్ని ఇవ్వగలిగినవాడు. మన్మథుడు పుట్టుకకు కారకుడు, మన్మథ బాణం తగిలితేనేకదా జీవుల జననం సంభవిస్తుంది. పాము మృత్యువునకు సంకేతం, పాము కాటు వేసిందంటే

మృత్యువు గ్రసించినట్టు అని అర్థం. మరి శ్రీ మహావిష్ణువో, అందరి పుట్టుకకీ కారణమౌతున్న మన్మథుణ్ణే కన్నవాడు, మృత్యువును తన తల్పంగా కలిగినవాడు, అంటే తన అవసరానికి ఆసనంగా, తల్పంగా వాడుకునేవాడు. అంటే ఈ రెంటికి అతీతుడు. మరి మోక్షాన్ని ఇచ్చి కామాన్ని, మరణాన్ని శాసించగలవాడు అలాగే తన భక్తులనీ కాపాడుకో గలిగినవాడు. (ఇక్కడ శ్రీ హరిని పరబ్రహ్మ తత్త్వంగా సృష్టి, స్థితి, లయలను ఆధీనములో కలవానిగా కీర్తించారు శంకరులు) అటువంటి శ్రీహరిని పద్మములవంటి తన కళ్ళతో కనుపాప కదలకుండా స్థిరమైన చూపులతో సగము మూసిన కనులతో చూచి మన్మథ తన్త్రాన్నే వశము చేసుకున్న శ్రీ మహావిష్ణువుకు ఆనందము కలిగించు చూపులున్న తల్లీ ఆ మీ కళ్యాణ కారకమైన చూపులు మాకు కూడా కళ్యాణమును కలిగించు గాక! అని ప్రార్థించారు.

<u>సందర్భం ప్రకారం:</u> అమ్మా లక్ష్మీ దేవీ! ఈ పేద బ్రాహ్మణ కుటుంబానికి ఏపుణ్యమూ లేదు అని కాదా నీవు ఐశ్వర్యమివ్వడానికి కుదరదన్నావు. సరే, నువ్వు స్వయంగా జనన మరణాలకు అతీతంగా ఉండి తన భక్తులను రక్షించే శ్రీ మహావిష్ణువుకి ఇల్లాలివి. వీరేమో ఏకాదశీ వ్రతం చేసి ద్వాదశి పారణ విధిగా చేస్తున్నవారు. మరి శ్రీ మహావిష్ణువు తన భక్తులు రక్షించే గుణమున్నవాడు. ఆయనకి ఎప్పుడూ ఆనందం కలిగించేదానవు నువ్వు, మన్మథుని పుట్టించిన ఆయనకే ఆనందం కలిగించే నీ చూపులు, ఒక్క సారి ఈ బీద బ్రాహ్మణ కుటుంబం మీద పడితే దాని వల్ల వారు ఉద్ధరింపబడితే, శ్రీ మహావిష్ణువు నీ చూపుల ద్వారా తన భక్తులు ఉద్ధరింపబడ్డారని ఇంకా ఆనందం పొందగలడు. తల్లీ ఆ మీ చల్లని కళ్యాణ కారకమైన చూపులచే మాకందరికీ కళ్యాణమగు గాక!

**శ్లో5!! కాలాంబుదాళి లలితోరసి కైటభారేర్**

**ధారాధరే స్ఫురతి యా తటిదంగనేవ !**

**మాతస్ సమస్త జగతామ్ మహనీయ మూర్తిర్**

**భద్రాణి మే దిశతు భార్గవ నందనాయా: !!**

తా : మబ్బు మధ్యలో మెఱయు మెఱుపు వలె విష్ణుమూర్తి యొక్క నీలమేఘ సన్నిభమైన వక్ష:స్థలమునందు విలసిల్లు మహనీయ మూర్తి, సకల జగన్మాత, శ్రీ మహాలక్ష్మీ భగవతి నాకు సమస్త శుభములను గూర్చు గాక !

<u>వివరణ:</u> శంకరులు ఇక్కడ శ్రీ హరిని కైటభారే అని సంబోధించారు, ఇక కైటభారే అన్న విషయానికొస్తే, మధు కైటభులనే రాక్షసులను శ్రీ మహావిష్ణువు సృష్టి ఆరంభంలో సంహరించారు. మధు కైటభులు ఇద్దరూ సోదరులు, వారెవరో కాదు, మధువు=నేను; కైటభుడు=నాది అనే గుణాలు. నాది అనేటప్పటికి మనం మన చేతులను గుండెలమీదపెట్టి నాది అంటాం. అటువంటి గుణానికి ప్రతినిధి ఐన కైటభుని సంహరించినవాడు శ్రీ హరి. అంటే అటువంటి గుణమునకు శత్రువు అని అంతర్లీనంగా కైటభ వృత్తాంతాన్ని పొందు పరిచారు శంకరులు. అంతేకాక కాలాంబుదాళి అన్న పద ప్రయోగం ద్వారా భగవంతుని కురవడానికి సిద్దంగా ఉన్న నల్లనిమేఘంతో పోలిక వేశారు. శ్రీహరిని నీల మేఘ శ్యాముడని పిలుస్తారు, కురవడానికి సిద్ధముగా ఉన్న మేఘం, మీన మేషాలు లెక్కపెట్టదు, ఎవరున్నారు ఎవరు లేరు చూడదు, దాహార్తి తో ఉన్నవాడు ఒక్కడే ఉన్నాడు కదా ఆ

ఒక్కడికే కురుద్దామని మేఘము ఆలోచించదు. ఒక్కపెట్టున తన దగ్గరున్నదంతా కురిసేసి వెళ్ళిపోతుంది. అటువంటి శ్రీహరి లలితమైన హృదయం కలవాడు. కారుణ్యమనే నీటితో నిండిన ఈ నల్ల మబ్బు గుండెలో దాక్కుని ఒక్కసారిగా స్ఫురించిన మెరుపు తీగ/ తటిల్లత/ బంగారు తీగ శ్రీ మహాలక్ష్మి. మెరుపు తీగతో కూడిన నల్లని మబ్బులు జనులందరకూ ఆహ్లాదకారకములెలాగో, అలా ఒకరిలో ఒకరైన మీ ఇద్దరి దర్శనము మాకు భద్రము చేయుగాక. అమ్మా మెరుపు తీగ స్వరూపమైన నువ్వు ఒక్కసారి మాపై దయతో మెరిసి కనిపిస్తే, ఆ మెరుపులో మేఘ స్వరూపమైన భగవంతుని చూపించే కారుణ్యమున్న దానవు (అంటే అమ్మ దయ ఉంటే అయ్యవారి దర్శనం చేయిస్తుంది అన్న భావన, భగవంతుని సౌందర్య దర్శనము చేయించినది అమ్మ. అంతేకదా!). అమ్మా నువ్వు అందరకూ తల్లివి కదా మరి అమ్మవైన నువ్వు ఇలా కష్టపడుతున్న బీద బ్రాహ్మణ కుటుంబాన్ని ఉద్ధరించాలికదా. అమ్మా అంత కారుణ్యమున్న భగవంతుని గుండెలలో ఉన్న దానవు నువ్వు. అమ్మా ఆ భగవంతుని కారుణ్యము, ఔదార్యము నువ్వే కదా. అలా వీరిని ఉద్ధరించగలిగిన శక్తిగా ఆయన గుండెలలో ఉన్నది నువ్వే కదమ్మా!

<u>సందర్భం ప్రకారం:</u> పూర్వ జన్మలలోఅలా నాది నాది అని గుండెలమీదనే చెయ్యిపెట్టుకుని చెయ్యిని తిరగేసి దాన ధర్మాలు చేయలేదు కనకనే బీద బ్రాహ్మణ కుటుంబానికి ఇప్పుడు దరిద్రం ఉన్నది అటువంటి దరిద్రాన్ని తొలగతోసే మేఘ స్వరూపమైన భగవంతుని కారుణ్యం ఇక్కడ కురవాలంటే భగవంతుని దర్శనం చేయించగలిగి, ఆయన గుండెలలో ఉండే నువ్వు ఒక్క సారి కారుణ్యాన్ని వర్షింపజేయి. ఈ బీదబ్రాహ్మణి అమ్మతనంతో నాకు ప్రేమతో ఒక అమ్మలా భిక్ష వేసింది. అమ్మ తనానికే పరాకాష్ట నువ్వు. అన్ని జగములకూ అమ్మవు నువ్వు. అమ్మా మరి ఆ అమ్మ ఇచ్చిన భిక్షను నేను సంతోషం తో స్వీకరించాలంటే మరి ఈ అమ్మ కష్టాన్ని తీయలేవా. ఎంత కారుణ్యముంటే నువ్వు భృగుమహర్షికి కూతురిలాపుట్టావు తల్లీ. అంత కారుణ్యమున్న మీరిరువురూ ఒక్కసారి కారుణ్యామృత చూపులు ఒక్కసారి మెరుపు మెరిసినట్టుగా ప్రసరిస్తే వీరి దారిద్ర్యం తొలగిపోతుంది.

**శ్లో6!! బాహ్యాంతరే మధుజిత: శ్రితకౌస్తుభే యా**

**హారావళీవ హరినీలమయీ విభాతి !**

**కామప్రదా భగవతోఽపి కటాక్ష మాలా**

**కల్యాణ మావహతు మే కమలాలయాయా: !!**

తా : శ్రీ మహావిష్ణువు యొక్క వక్ష: స్థలమునందలి కౌస్తుభ మణి నాశ్రయించి దాని లోపల, వెలుపల కూడ ఇంద్రనీల మణిహారములవంటి ఓరచూపులను ప్రసరింప జేయుచు కోరికలను తీర్చు లక్ష్మీదేవి నాకు శ్రేయస్సును చేకూర్చు గాక !

<u>వివరణ:</u> శ్రీ శంకరులు ఈ శ్లోకంలో శ్రీ హరిని మధుజిత: అన్న నామంతో సంబోధించారు. పై శ్లోకంలో వివరించినట్లు మధువు=నేను; కైటభుడు=నాది అనే గుణాలు. ముందు నాది అనే భ్రాంతిని తొలగతోసి తరవాత నేను అనే అహంకారాన్ని తొలగతోయగలడు శ్రీ హరి అన్న అర్థాన్ని స్ఫురించేలా ముందు శ్లోకంలో కైటభారే అని

తరవాత శ్లోకంలో మధుజిత్ అన్న నామాన్ని వాడారు. నేను నాది అన్న భావన పోయిననాడు మనిషికి పాప కర్మలు చేయవలసిన పని ఉండదు, నేను నాది అన్న భావన తొలగుతే అంతా పరబ్రహ్మమును చూస్తూ ఆత్మగా మిగిలిపోయి, తన పక్కవారి బాధను తనదిగా తలచి వారికి వలసిన దాన ధర్మాలు సహాయాలు చేయగలడు. మధు కైటభులను సంహరించిన శ్రీమహావిష్ణువు వక్షస్థలమందు అమ్మ లక్ష్మీదేవి కొలువై ఉండి తన చూపులను ప్రసారం చేయగా ఆ చూపులు ఆయన హృదయంలోనూ, బయట ఉన్న కౌస్తుభమణికి గొప్పనైన ప్రకాశముని ఇవ్వగలిగిన చూపులు ఆ చూపులు. తనతోపాటు సముద్రములో పుట్టినదే ఐనా ఆ కౌస్తుభమణి కాంతులు ఆ అమ్మ చూపుల కాంతి వల్లనే ప్రకాశిస్తున్నాయి అన్న అర్థం కూడా అన్వయమయ్యేటట్టు తల్లి లక్ష్మీదేవిని "కమలాలయాయా:" అని సంబోధించారు. ఆ విష్ణువక్షస్థలవాసిని ఐన ఆ తల్లి నల్లని చల్లని చూపులు విష్ణు భగవానుని గుండెలపై వేసిన ఇంద్రనీలమణుల హారములవలె ఉన్నాయి. అటువంటి చల్లని చూపులు మాకు శ్రేయస్సునుచేకూర్చుగాక.

<u>సందర్భం ప్రకారం:</u> అమ్మా స్వయంగా శ్రీ విష్ణుభగవానుని కోర్కెలే తీర్చగల శక్తివి నీవు, విష్ణుభగవానుడు ఇతరుల కోర్కెలు తీరుస్తున్నాడూ అంటే దానికి మూల శక్తివి నువ్వేకదమ్మా! నేను నాది అన్న భావంతోటే పోయినజన్మలో చేసిన పుణ్యం లేక ఇప్పుడు దరిద్రం అనుభవిస్తున్నారు ఈ బీద బ్రాహ్మణులు. అందరికోర్కెలు తీర్చే విష్ణుభగవానునికి ఆ కోర్కెలుతీర్చేశక్తిగా ఉన్నది నువ్వేకదమ్మా ఆయన గుండెలలో. అటువంటి మీ చూపులు ఒక్కసారి వీరి మీద ప్రసరిస్తే ఆ చూపులు వారికి శ్రేయస్సును కలిగిస్తాయి అని శంకరులు ప్రార్థించారు.

**శ్లో7!! ప్రాప్తమ్ పదమ్ ప్రథమత: ఖలు యత్ ప్రభావాత్**
**మాంగల్య భాజి మధుమర్దిని మన్మథేన !**
**మయ్యాపతేత్ తదిహ మంథర మీక్షణార్ధమ్**
**మందాలసం చ మకరాలయ కన్యకాయా: !!**

తా : దేని ప్రభావముచేత మన్మథుఁడు సమస్త కల్యాణ గుణాభిరాముఁడైన శ్రీ విష్ణుమూర్తి యొక్క మనస్సునందు (ఆయనను మన్మథబాధకు గుఱిచేయుట ద్వారా) మొదటి సారిగా స్థానము సంపాదించుకొన్నాడో, ఆ లక్ష్మీదేవి యొక్క నెమ్మదైన మఱియు ప్రసన్నమైన ఓరచూపు నా మీద ప్రసరించు గాక !

<u>వివరణ:</u> ఈ శ్లోకంలో కూడా శంకరులు మధుమర్దిని అన్న పదాన్ని విష్ణువుకు వాడారు, ఆంతరంగా అమ్మవారికీ ఈ పదాన్ని వాడారు. అలా ఎలా అంటే, మధు కైటభులను శ్రీహరి సంహరించినప్పుడు జగజ్జనని మధు కైటభులను మోహపరచడానికి (కామప్రదమైన) తన చూపులను మధుకైటభులపై ప్రసరింపజేయగా దానితో విర్రవీగిన ఆ రాక్షసులు విష్ణువుకే వరం ఇవ్వడానికి సిద్ధపడగా విష్ణువు వారి చావునే వరంగా కోరాడు అలా ఆ తల్లి తన చూపులతో మొట్టమొదటి రాక్షస సంహారంగా తన చూపులతో విష్ణువును అనుగ్రహించి అందరికీ అన్నీ ఈయగల విష్ణువుకు మధుకైటభ సంహారం అనే కోరిక తీర్చినది. దీనిద్వారా మధుమర్దిని అన్న

నామం శ్రీమహావిష్ణువుకు అమ్మవారికీ కూడా చెందుతుంది. ఏ అమ్మవారి చూపుల ప్రభావంచేత మధుకైటభులు మోహాంధులై సంహరింపబడ్డారో, ఏ చూపుల వలన మధువనే రాక్షసుని చంపే మంగళకార్యం శ్రీహరి చేయగలిగెనో, అటువంటి చూపులు కలిగిన తల్లి లక్ష్మి దేవి (ఇక్కడ లక్ష్మీదేవిని ఆదిశక్తిగా శంకరులు కొలుస్తున్నారు) విష్ణుభగవానుని హృదయమనే స్థానాన్ని అలంకరించినట్టి లక్ష్మీదేవి, నిర్హేతుకంగా మొసళ్ళు మొదలగు క్రూర ప్రాణులు నివసించు సముద్రుని కరుణించి కూతురుగా పుట్టిన తల్లి లక్ష్మీదేవి తన నెమ్మదైన, కరుణాపూరితమైన నిమ్మీలిత నేత్ర దృష్టిని మాపై ప్రసారం చేయుగాక.

<u>సందర్భం ప్రకారం:</u> అమ్మా లక్ష్మీదేవీ, ఏ కారణముందని నీ కరుణతో తనలో ఎన్నో క్రూరప్రాణులని ఉంచి పోషిస్తున్న సముద్రునికి కూతురువయ్యి లక్ష్మీదేవి తండ్రి అని సముద్రునికి కీర్తినిచ్చావు? అది నీ అపార దయ కారుణ్యం, అది నిర్హేతుకము. అలాగే అదే కారుణ్యముతోటి ఈ బీద బ్రాహ్మణ కుటుంబాన్ని ఉద్ధరించవా. అమ్మా నీ మోహపు చూపుల ప్రభావంచేతనేకదా మధువనే రాక్షసుని వధ అనే మంగళ కార్యమును శ్రీమహావిష్ణువు నిర్వర్తించినాడు. ఒకసారి నీ చూడ్కులు రాక్షసులు సంహరింపబడడానికి, శ్రీమహావిష్ణువు రాక్షస సంహారమనే మంగళకార్యముచేయడానికి హేతువులైనాయి కదా. మరి ఈ బీద బ్రాహ్మణ కుటుంబానికి ఏ హేతువులేక ఐశ్వర్యాన్ని ఇవ్వలేకపోతే, నీచూపులను ప్రసారించి అవే హేతువులుగా చూపి ఐశ్వర్యాన్ని కటాక్షించు తల్లీ. అందరికోర్కెలు తీర్చే విష్ణుభగవానుని కోర్కెలే తీర్చగలిగిన నీచూపులు దరిద్రులైన వీరిని ఉద్ధరించగలవు. కాబట్టి నీ కరుణాపూరితమైన చూపులను మాపైన వర్షింపజెయి.

**శ్లో8!! దద్యాద్దయానుపవనో ద్రవిణాంబుధారా**

**మస్మిన్నకించన విహంగ శిశౌ విషణ్ణే !**

**దుష్కర్మ ఘర్మ మపనీయ చిరాయ దూరం**

**నారాయణ ప్రణయినీ నయనాంబువాహ: !!**

తా : లక్ష్మీదేవి యొక్క నీలమేఘముల వంటి నల్లని కనులు, ఈ దరిద్రుఁడనెడి విచారగ్రస్త పక్షి పిల్లపై దయ అనెడి చల్లని గాలితో కూడుకొని వీచి, ఈ దారిద్ర్యమునకు కారణమైన పూర్వజన్మల పాపకర్మలను శాశ్వతముగా, దూరముగా తొలగద్రోసి, నా మీద ధనమనెడి వానసోనలను ధారాళముగా కురియించు గాక !

విశేషార్థము : "అకించన" అన్న పదానికి 'దరిద్రుడు' అని, 'పాపములు లేనివాడు' అని రెండర్థాలు.

<u>వివరణ:</u> ఇక్కడ శ్రీ హరిని నారాయణ అన్న నామంతో అమ్మవారిని నారాయణ ప్రణయినీ అన్న నామంతో సంబోధించారు శంకరులు. నారాయణ అన్న పదానికి నీటికయ్య లేదా పుష్కలమైన నీరుఉన్న ప్రదేశము ఇల్లుగా కలవాడు అని అర్థము కూడా ఉన్నది. (సమస్త జీవజాలమూ విశ్రాంతి తీసుకొను ప్రదేశము అన్న అర్థముకూడా ఉన్నది) నీరు ఎక్కువగా కావలసినది బాగా తాపము, దాహమున్నవారికి. ఆ నీటినే ఇల్లుగా చేసుకున్నవాడు విష్ణుభగవానుడు. మరినువ్వో ఆ విష్ణుభగవానుని పత్నివి. నీకన్నులనిండా కారుణ్యము ఆర్ద్రత అనే నీటిమేఘాన్ని కలిగి ఉన్నదానివి. అమ్మా మేఘాలు ఏంచేస్తాయమ్మా, భరింపరాని గ్రీష్మతాపాన్ని పోగొడతాయి. అమ్మా గ్రీష్మ తాపంతో అల్లాడుతున్న పక్షిపిల్లకు కలిగే వేడిని దయ అనే చూపులతో తొలగతోసి,

విషాదంలో మునిగిఉన్న ఈ పక్షికి నీ కన్నులనిండా నల్లగా ఉన్న మేఘమనే కరుణార్ద్ర చూపులను ప్రసరించి కారుణ్యాన్ని వర్షించి తాపాన్ని తీర్చమ్మా.

సందర్భం ప్రకారం: విహంగ శిశౌ అనే అర్థంతో పక్షిపిల్ల అన్న అర్థంతోపాటు, బ్రాహ్మణులు అన్న అర్థం కూడా వస్తుంది. పక్షి గుడ్డుగా ఒకసారి పిల్లగా ఒకసారి జన్మిస్తుంది కాబట్టి ద్విజ అని అంటారు. అలానే బ్రాహ్మణులకి కూడా ఉపనయనం అయ్యినతరవాత ద్విజ అని సంబోధిస్తారు. కాబట్టి విహంగ శిశౌ అని అన్నప్పుడు ఈ బ్రాహ్మణులకి అన్న అర్థం కూడా అన్వయమౌతుంది. తాపంతో ఉన్నవారికి నీరిస్తే సరిపోతుంది కదా మళ్ళీ దయ అనే చూపులతో వేడిని తీయడమెందుకు? అంటే ఇప్పుడు తాపం తొలగుతుంది మళ్ళీవేడి పుట్టినప్పుడు మళ్ళీ తాపం పుడుతుంది. అమ్మా ఇప్పుడు వీరికి కావలసిన ఐశ్వర్యమే కాదు, ఇప్పటిదాకా ఐశ్వర్యంపొందకుండా అడ్డుగా ఉన్న పాపాలని నీవు దయతో తొలగతోయలేదా, నువ్వు కేవలం ఐశ్వర్యమిచ్చినా వారి పూర్వ పాపం మిగిలిపోతే, దాని వల్ల అది భ్రష్టమౌతుంది. కాబట్టి తల్లీ వారి పూర్వజన్మ పాపాలని తీసి కురియడానికి సిద్ధంగా ఉన్న నీకళ్ళనే మేఘాలని వారిపై వర్షించు. మరి పాపాలంటే తీస్తాను కాని ఇవ్వడానికి పుణ్యమేదీ అని అంటావేమో! ఇదిగో నాకు దానం చేసిన ఉసిరికాయ ఇంకా నాచేతిలోనే ఉంది అదేసాక్ష్యం. దయ అనేసముద్రాన్ని ఇల్లుగా చేసుకున్నవాడు నారాయణుడు, అతని పత్నిపైన నీవో ఆ దయనే కళ్ళల్లో, కారుణ్యాన్నే చూపుల్లో పెట్టుకున్నదానివి నువ్వు. మీ చల్లని చూపులు మాదారిద్రమనే తాపాన్ని, పూర్వజన్మపాపాలను పోగొట్టుగాక.

**శ్లో9!! ఇష్టా: విశిష్ట మతయోఽపి నరా యయాఃః**
**దయార్ద్ర దృష్ట్యా త్రివిష్టపపదం సులభం లభన్తే!**
**దృష్టి: ప్రహృష్ట కమలోదర దీప్తిరిష్టామ్**
**పుష్టిం కృషీష్ట మమ పుష్కర విష్టరాయాః !!**

తా : ఎవరు కరుణార్ద్ర దృష్టితో చూచినచో ఆశ్రితులైన పండితులు (జ్ఞానులు) తేలికగా స్వర్గధామమున సుఖించెదరో, విష్ణుమూర్తినే అలరించునట్టి వెలుగుతో విలసిల్లు ఆ కమలాసనురాలైన లక్ష్మీదేవి నాకు కావలసిన విధముగా సంపన్నతను ప్రసారించు గాక !

వివరణ: ఈస్తోత్రంలో బాల శంకరులు అమ్మవారిని లక్ష్మీ దేవిగానే కాక ముగురమ్మలుగా కీర్తిస్తున్నారు, ఎవరి చల్లని కంటి చూపువలన మానవులు వాంఛా ఫలత్వము, గొప్పనైన బుద్ధి మరియు జ్ఞానమును పొంది అంత్యమున స్వర్గాది లోకములను మోక్షమును పొందుతున్నారో ఆ చూపులకు కారణమైనటువంటి బాగుగా విప్పారినటువంటి కమలముల లాంటి అందమైన కళ్ళు కలిగిన ( బాగా విప్పారిన కమలము మధ్యలో చల్ల దనము, తడి బిందువులు ఉంటాయి, అంటే అమ్మవారి కన్నిలు బాగా విప్పారి భక్తుల ఆర్తి తీర్చడానికి తడి

ఉన్న కన్నులు అని చెప్పటానికి ఈ ఉపమానం వేశారు శంకరులు), పద్మము పై విరాజిల్లిన లక్ష్మీదేవి యొక్క ఆ చల్లని కృపాదృష్టి మా అందరిపై వర్షించు గాక.

సందర్భం ప్రకారం: అమ్మా నువ్వు ఈ బీద బ్రాహ్మణ కుటుంబం ఆర్తిని తీర్చలేనిదానవుగాదు. నిన్ను ఆశ్రయించిన వారికి కేవలం ఐశ్వర్యమే కాదు సకల కోరికలు తీర్చగలవు, జ్ఞానమియ్యగలవు, స్వర్గాదులు మోక్షము ఇయ్యగలవు. అందుకు ఋజువు లోకంలో ఎందరో పండితులు నిన్ను స్తుతి చేయడమేగదా. అందరికీ అన్నీ ఈయగల నువ్వు ఈ బీద బ్రాహ్మణ కుటుంబానికి కలిగిన తాపాన్ని తీయడానికి నీ కృపాపూర్ణ దృక్కులు మాపై ప్రసరించెదవుగాక.

**శ్లో10!! గీర్దేవతేతి గరుడధ్వజ సుందరీతి**
**శాకంభరీతి శశిశేఖర వల్లభేతి !**
**సృష్టి స్థితి ప్రళయ కేళిషు సంస్థితా యా**
**తస్యై నమస్త్రిభువనైక గురోస్తరుణ్యై !!**

తా : విష్ణుమూర్తికి భార్యయైన లక్ష్మిగా, బ్రహ్మదేవుని పత్నియైన సరస్వతిగా, సదాశివుని అర్ధాంగియైన అపరాజితగా, శాకంభరీదేవిగా - ఇట్లనేక రూపములతో ఏ విశ్వమాత సృష్టి, స్థితి, ప్రళయ లీలను సాగించుచున్నదో, ఆ విశ్వాత్మకుడైన పరమ పురుషుని ఏకైక ప్రియురాలికి నమోన్నమహ.

వివరణ: శంకరులు ఇక్కడ అమ్మవారిని పరబ్రహ్మమహిషిగా సాక్షాత్ జగదంబ సృష్టి స్థితి లయ కారకురాలిగా, లోకాలను పోషించే తల్లిగా కీర్తించారు. సృష్టి కర్త ఐన బ్రహ్మ గారి సృష్టించే శక్తిగా ఉన్న సరస్వతిగా, స్థితికారకుడైన విష్ణుమూర్తియొక్క రక్షించే శక్తి ఐన లక్ష్మీదేవిగా, లయ కారకుడైన చంద్ర శేఖరుని యొక్క లయ కారక శక్తి ఐన పార్వతిగా ఉన్న ముగురమ్మల మూలశక్తివి నీవు. నీకు అసాధ్యమైనది ఏదీలేదుకదమ్మా!, సృష్టి స్థితి ప్రళయాలనే ఆటలను చక్కగా నిర్వర్తించే శక్తిగా త్రిమూర్తులను ఆశ్రయించి ఉన్న తల్లివి నీవు. అమ్మా ఒకానొకనాడు క్షామం వచ్చి జనులకి తినడానికి తిండిలేక లోకాలు నీరసించిపోతే, వారి బాధలు చూసి తట్టుకోలేక శతాక్షి గా వచ్చి జనుల కష్టాలు చూసి శతాక్షి రూపంతో ఆర్ద్రత నిండిన కన్నులతో కరుణా పూరితమైన చూడ్కులతో కాపాడావు. ఆ వెంటనే ఎవరైనా అడిగారా, తపస్సు చేశారా పాప పుణ్య ఫలితాలేమిటి అని ఆలోచించక ఆకలిని తీర్చడానికి సమస్త ధాన్యాలు, కూరగాయలు, పళ్ళు రూపంగా వచ్చి జనులందరికీ అప్పటికప్పుడు తినడానికి కావలసిన పదార్థాలను సమకూర్చావు. అది కేవలం నీ మాతృత్వభావన వల్లనే కదమ్మా. నువ్వు అన్ని జగాలకీ తల్లివి కనకనే ఎవరూ అడగకపోయినా అందరికీ అమ్మగా అన్నీ ఇచ్చావు. తల్లీ! అటువంటి నీకు ముల్లోకములకూ గురుస్వరూపమైన వాని పత్నివైన నీకు ఏమి ఇవ్వగలమమ్మా! కేవలం నమస్కారము తప్ప.

సందర్భం ప్రకారం: అమ్మా నువ్వు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వారు నిర్వర్తించే సృష్టి, స్థితి, ప్రళయం అనే ఆటలకు మూల శక్తివి నువ్వే కదా. అటువంటి దానవు ఈ బీద బ్రాహ్మణ కుటుంబానికి వారి పాపాలను హరించి,

వారు నాకు ఇచ్చిన ఈ ఉసిరిక దానాన్నే గొప్ప పుణ్యంగా మలిచి వారికి కావలసిన ఐశ్వర్యాన్ని ఇవ్వలేవా తల్లీ! అమ్మా ఎవరూ అడగకపోయినా, లోకంలో జనులందరూ కరువు కాటకాలకు గురియై ఉండగా శరీరమంతా కళ్ళు చేసుకుని ప్రాణుల కష్టాలకు చలించి నీ వంటినిండా ఉన్న కళ్ళలోని ఆర్ద్రతతో ముల్లోకాల కష్టాలనూ తీర్చడానికి శాకంబరిగా అవతరించి అందరి ఆర్తినీ ఆకలినీ తీర్చావు కదా తల్లీ! మరి ఈ బీద బ్రాహ్మణ కుటుంబం అప్పుడు లోకానికి కలిగిన కష్టం వంటి కష్టంలోనే ఉన్నారు. అప్పుడు ఎవరు స్తుతించారు ఎవరు స్తుతి చేయలే, ఎవరికెంత పాపముంది, ఎవరికెంత పుణ్యముంది అని చూడకుండా నీ నిండైన అమ్మతనంతోనే కదమ్మా లోకాలని కాపాడావు. మరి ఈ బీద బ్రాహ్మణ కుటుంబం ఏం చేసిందమ్మా! వారిని కూడా నువ్వు అనుగ్రహించవచ్చు కదాతల్లీ. అమ్మా గురుపత్ని ఎప్పుడూ శిష్యుడు యోగ్యుడా అయోగ్యుడా బాగా చదివే వాడా లేదా ఐశ్వర్యవంతుడాలేదా అని చూడదు కదా అందరు శిష్యుల మీదా స్వపుత్రులలా మమకారంతో ఉంటుంది కదా! అమ్మా మరి నువ్వూ లోకానికే గురువైన వాని పత్నివి మరి ఎందుకమ్మా ఈ బ్రాహ్మణ కుటుంబాన్ని ఉద్ధరించడంలో ఆలస్యం చేస్తున్నావు.

**శ్లో11!! శ్రుత్యై నమోఽస్తు శుభకర్మ ఫల ప్రసూత్యై**
**రత్యై నమోఽస్తు రమణీయ గుణార్ణవాయై !**
**శక్త్యై నమోఽస్తు శతపత్ర నికేతనాయై**
**పుష్ట్యై నమోఽస్తు పురుషోత్తమ వల్లభాయై !!**

తా : శుభములైన శ్రౌత, స్మార్త కర్మలకు సముచిత ఫలములనిచ్చువేదమాతృస్వరూపురాలైన లక్ష్మీదేవికి నమస్కారము. ఆనందపఱచు గుణములకు సముద్రము వంటి విశాలమగు రతీదేవి స్వరూపురాలైన మాతకు ప్రణామము. నూఱు దళముల పద్మముపై ఆసీనురాలైన శక్తిస్వరూపురాలికి వందనము. విష్ణుమూర్తికి ప్రియురాలై పుష్టి నొసగు ఇందిరాదేవికి నమస్కారములు.

<u>వివరణ:</u> వేదరూపిణియై సకల శుభ ఫలములను ఇచ్చు వేదస్వరూపమైన తల్లికి నమస్కారము, వేదము సకల శుభ కర్మలకు శుభఫలములనిచ్చు స్వరూపము, శ్రౌత స్మార్త కర్మలను ఒనగూర్చువారికి సకల శుభ ఫలములనిచ్చునది. వేదము స్వరూపము ధర్మ స్వరూపమే కాబట్టి ధర్మవర్తనులకు శుభ కర్మ ఫలాలనిచ్చు శక్తికలిగిన శ్రుతి స్వరూపమైన తల్లికి నమస్కారము. నానా రత్నములను తన గర్భములో దాచుకొనిన విశాలమైన సముద్రవలె, రమణీయమైన గుణములకు సముద్రమువంటిదైన రతీదేవి (అనుభవపూర్వకమూ చేయు శక్తిగాఉన్నటువంటి తల్లి, మన్మథుడు= కోరిక; రతి=అనుభవములోనికి వచ్చుట) వంటి తల్లికి నమస్కారములు. నూరు దళములు కలిగిన పద్మములో నుండు అన్ని శక్తులకూ ఆధారభూతమైన శక్తికి నమస్కారము. పురుషోత్తముడైన శ్రీహరికి పుష్టిని స్ఫూర్తిని కలిగించు తల్లి శ్రీ లక్ష్మీ దేవికి నమస్కారము.

<u>సందర్భం ప్రకారం:</u> అమ్మా వేద స్వరూపమైన తల్లివి నీవే కదా, వేదము శుభ కర్మలకు శుభ ఫలములిచ్చును కదా, పైగా ఇంత దరిద్రములోనూ అధర్మ మార్గము పట్టక ఉంఛవృత్తితో జీవనము సాగిస్తూ స్వాధ్యాయం చేసుకుంటూ గడుపుతున్న కుటుంబం ఈ బ్రాహ్మణ కుటుంబం. వేదాన్ని, ధర్మాన్ని నమ్మి నలుగురికీ బోధ

చేయవలసిన బ్రాహ్మణ కుటుంబానికే శుభ ఫలములతో ఐశ్వర్యమునివ్వకపోతే వేదాన్ని, ధర్మాన్ని పాటించే వారు కరవై ధర్మ లుప్తమౌతుంది తల్లీ. లోకంలో ధర్మానికి ఆపద వచ్చినప్పుడు ధర్మాన్ని కాపాడే వాడు పురుషోత్తముడైన శ్రీమహావిష్ణువు అటువంటి శ్రీ మహా విష్ణువుకే స్ఫూర్తిని పుష్టిని ఇచ్చేదానవు నీవు, నీవు వీరికి ఐశ్వర్యమునిచ్చి వేదాన్ని ధర్మాన్ని నమ్మినవారికి ఆపదలు, ఇక్కట్లు లేకుండా చేయవలసిన దానవు నువ్వేకదాతల్లీ. అమ్మా కేవల ధనవృద్ధితోనే ఐశ్వర్యవంతులు కాలేరు కదాతల్లీ, ఆ ధన ధాన్య వృద్ధి అనుభవైకవేద్యమవ్వాలి ( మన్మథుడు కోరికకు రూపమైతే ఆయన పత్ని తల్లి రతీదేవి ఆ కోరిక అనుభవములోకి వచ్చినప్పటి అనుభూతి) సముద్రము ఎంత విశాలమో, ఎన్ని రత్నాలను అందులో దాచుకున్నదో అంత గొప్ప అనుభవైకవేద్యమైన అనుభూతులను ఇవ్వగలిగిన తల్లివి నువ్వు. తల్లీ వీరికి ఐశ్వర్యమునిచ్చి, పాపములను తీసి ఆ ఐశ్వర్యమును అనుభవైకవేద్యముగ చేయగల తల్లివి. అమ్మా అన్ని శక్తులకు మూలమైన శక్తివి నువ్వు నీకు ఈ అనుగ్రహాన్ని కురిపించుట అతి తేలికైన పని అమ్మా అంత గొప్ప తల్లివైన నీకు పున: పున: పున: ప్రణామాలు.

**శ్లో12!! నమోఽస్తు నాళీక నిభాననాయై**

**నమోఽస్తు దుగ్ధోదధి జన్మభూమ్యై !**

**నమోఽస్తు సోమామృత సోదరాయై**

**నమోఽస్తు నారాయణ వల్లభాయై !!**

తా : పద్మము వంటి ముఖము గలిగిన మంగళదేవతకు నమస్కారము. పాల కడలిని తన జన్మస్థానముగా గల శ్రీ పద్మాలయా దేవికి వందనము. అమృతమునకును, దానితో పాటుగా ఉద్భవించిన చంద్రునికిని తోబుట్టువైన దేవికి ప్రణామము.భగవాన్ విష్ణుమూర్తికి ప్రేమాస్పదురాలైన లోకమాతకు దండములు.

<u>వివరణ: </u>పద్మసదృశమైన ప్రకాశము కలిగిన తల్లి లక్ష్మీ దేవికి నమస్కారము, ఇక్కడ నాళీకనిభాననాయై అన్నప్పుడు లక్ష్మీ స్థానములలో ఒకటైన పద్మాన్ని ఉటంకించారు. ఐదు లక్ష్మీ స్థానాలు, పద్మము, గో పృష్టము, మారేడు దళం వెనుక తట్టు, స్త్రీ పాపట, ఏనుగు కుంభస్థలము. సౌభాగ్య ప్రదమైన ముఖము కలిగిన మంగళ దేవతకు నమస్కారములు అని ఈ శ్లోకాన్ని ప్రారంభించారు బాల శంకరులు. తరవాతి పాదంలో అమ్మా నీ జన్మ భూమి పాల సముద్రం. పాల సముద్రంలో అనంత ఐశ్వర్య ప్రదమైన వస్తువులూ ఉన్నాయి లక్ష్మీ దేవి పాల సముద్రంలోంచి పైకి వచ్చినప్పుడు ఆమెతోపాటు అనేక వస్తువులు బయటికొచ్చాయి. ఆమె పుట్టిల్లు పాలసముద్రం ఐశ్వర్యాలకి పుట్టినిల్లు. అమ్మా నీ పుట్టునిల్లు అటువంటిది. ఐశ్వర్యముందికాని ఆరోగ్యము ఆయుష్షు, ఆహ్లాదము వంటివి సంశయం అందామా, స్వయంగా అమృతము, చంద్రుడు నీ సోదరులు. ఆరోగ్యము ఆయుష్షు అమృతము ఇస్తుంది, అందరికీ ఆహ్లాదాన్ని ఆనందాన్ని చంద్రుడు కలిగించి వారి తాపాలని తీస్తాడు. అటువంటి వారు సోదరులుగా కలిగిన పుట్టిల్లు కలిగినది. పోనీ అత్తవారిల్లు ఏమన్నా తక్కువదా అందామంటే నారాయణుని మనస్సు దోచుకున్న తల్లివి నువ్వు. నారాయణుడు అంటే సకల ప్రాణుల విశ్రాంతి స్థానము అని కదా అర్థము, అంటే అందరికీ మోక్షాన్ని ఇవ్వగలిగినవాని మనసుదోచుకున్న

తల్లివి నీకేమి తక్కువమ్మా! పుట్టీ పుట్టగానే పుట్టినింటికి మెట్టి అత్తింటికి కీర్తి తెచ్చినదానవైన తల్లీ లక్ష్మీదేవీ నీకు ప్రణామములు.

<u>సందర్భం ప్రకారం:</u> పద్మంలాగా ప్రకాశవంతమైన ముఖము కలిగిన తల్లీనీకు నమస్కారము, అమ్మా నువ్వు ఉండే ఐదు లక్ష్మీ స్థానాలలో పద్మము ఒకటైతే మరొకటి స్త్రీ పాపట కదా, మరి ఈ బీద బ్రాహ్మణి స్త్రీ సుహాసిని, భర్త యొక్క ధనమును గడించలేని శక్తిని కించపరచకుండా పాతివ్రత్యంతో తన భర్త ఉంఛవృత్తితో తెచ్చిన గింజలను వండి భర్తకు పెట్టుటకై ఎదురు చూస్తున్న తల్లి ఈ మంగళదేవత, మరి ఈమె యొక్క పాపటనందు కూడా నివసించి వారి దారిద్ర్యాన్ని పోగొట్టలేవాతల్లీ! అమ్మా వీళ్ళని ఉద్ధరించేశక్తి నీదగ్గరలేదనలేవు ఎందుకంటే పుట్టీ పుట్టగానే పుట్టినిల్లైన పాల సముద్రానికి ఎంతో కీర్తినిచ్చావు. నీ పుట్టిలు స్వయంగా రత్నాలకు ఐశ్వర్యానికి నిలయమైనది, నీ సోదరులో ఆయువుని, ఆరోగ్యాన్ని, ఆహ్లాదాన్ని, మానసిక పుష్టిని ఇచ్చేవారు. అంత గొప్ప పుట్టిల్లు కలదానవు కదా మరి ఈ బ్రాహ్మణి కుటుంబాన్నెందుకమ్మా ఇంత దరిద్రంతో ఉంచావు. పోనీ నీ భర్త అశక్తుడు అత్తవారిల్లు గొప్పదికాదా అంటే, ఆయనేమో స్వయంగా నారాయణుడు. చివరికి అందరికీ మోక్ష సామ్రాజ్యాన్ని ఇవ్వగలిగినవాడు. మోక్షమే ఇవ్వగలిగిన అత్తారిల్లు కలిగిన నీకు వీరికి ఐశ్వర్యాన్ని కటాక్షించటం పెద్ద పనా అమ్మా!... అంత గొప్ప కుటుంబీకురాలవైన తల్లీ లక్ష్మీదేవి నీకు నమస్కారము!

**శ్లో13!! నమోఽస్తు హేమాంబుజ పీఠికాయై**

**నమోఽస్తు భూమండల నాయికాయై !**

**నమోఽస్తు దేవాది దయాపరాయై**

**నమోఽస్తు శార్ఙ్గాయుధ వల్లభాయై !!**

తా : బంగారు పద్మమునే తన పీఠముగా అధివసించి యున్న శ్రీమన్మహాలక్ష్మీ భగవతికి నమస్కారము. సమస్త భూమండలమునకున్ను ప్రభుత్వము వహించి యున్న శ్రీ భార్గవీమాతకు వందనము. దేవ, దానవ, మనుష్యాదులందఱిపట్ల దయజూపజాలిన ఆ మహాశక్తి సంపన్నురాలికి ప్రణామము. శార్ఙ్గమను ధనుస్సును ధరించిన భగవాన్ విష్ణుమూర్తికి మిక్కిలి కూర్చునదైన శ్రీ కమలాదేవికి దండములు.

<u>వివరణ:</u> బాల శంకరులు శ్రీ హరి లోకరక్షణాది గుణములు కలిగినవాడు అన్న అర్థం కలగటానికి శార్ఙ్గాయుద్ధ అన్న నామాన్ని వాడారు. భగవంతుని చేతిలోని ధనస్సుచే ఇక్కడ భగవంతుని రక్షణ సామర్థ్యాన్ని, ఆయన భక్త జనులను రక్షించటానికి ఎంత తయారుగా ఉంటాడు అన్నది తెలపటానికి ఈ నామం వాడారు. ఆ విష్ణుభగవానుడే భాగవతంలో ఇలా చెప్పాడు

*<u>శుద్ధ సాధులందు సురలందు శ్రుతులందు</u>*

*<u>గోవులందు విప్రకోటియందు</u>*

*<u>ధర్మ పదవియందు దగిలి నాయందు వా</u>*

*<u>డెన్న డలుగు నాడె హింసనొందు (పోతన కృత శ్రీమదాంధ్ర భాగవతం)</u>*

.... అంటే విష్ణువు శుద్ధసాధులకు, సురులకు, వేదాలకు, గోవులకు, విప్రులకు, ధర్మానికి హాని కలుగనీయకుండా శార్ఙ్గమనే ధనస్సుతో సిద్ధంగా ఉంటాడు అని తెల్పటం ముఖ్యోద్దేశం. శంకరులు ఇక్కడ ఇంకొక చమత్కారము చేశారు, పై శ్లోకంలో లక్ష్మీదేవి పుట్టింటినీ మెట్టినింటినీ కీర్తించినా, అమ్మవారు నాదేముందిలే అది నాపుట్టినిల్లు మెట్టినిల్లు గొప్పదనం నేను వీరికి ఐశ్వర్యం ఇవ్వలేను నేను పాప పుణ్యాల ఆధారంగానే ఫలితమిస్తాను అని అనకుండా అమ్మవారికి ముందరికాళ్ళ బంధం వేసినట్టుగా ఈ శ్లోకంలో అమ్మవారిని కీర్తించారు. అమ్మా నువ్వు బంగారు పద్మమునే ఆసనంగా చేసుకుని ఉన్నదానవు. మొత్తం ఈ భూమండలానికే నాయకివి. (భూమాత ఈమెయేకదా). ఎన్నో మార్లు దేవతాది గణముల పట్ల దయజూపినదానవు. ఆర్త రక్షణ, దుష్ట శిక్షణ చేయు దైవ స్వరూపం విష్ణుభగవానుని ప్రియ పత్నివి. అటువంటి భూమండల నాయికవైన నీకు నమస్కారము, తల్లీ ఈ బీద బ్రాహ్మణ కుటుంబాన్ని రక్షించ వలసినది.

<u>సందర్భం ప్రకారం:</u> అమ్మా శ్రీహరి శుద్ధసాధులకు, సురులకు, వేదాలకు, గోవులకు, విప్రులకు, ధర్మానికి హాని కలగనీయనని వ్రతం కలిగినవాడు. అంతటి భక్త రక్షణా దురంధరుడు నీ భర్త. మరి ఇక్కడేమో విప్ర కుటుంబము ధర్మావలంబనం చేస్తూ, వేదాన్ని నమ్ముకుని శుద్ధ సాధుజీవనం గడుపుతూ దరిద్రంతో బాధ పడుతున్నారు వారిని రక్షించగలదానివి శార్ఙ్గాయుధుడైన శ్రీహరి ఇల్లాలివి నీవే, నీకు నమస్సులు. ఇక నీ విషయానికొస్తే, పుట్టిల్లు, మెట్టినిల్లు, భర్తలే గొప్పవారు అని నువ్వు తప్పించుకుంటావేమో తల్లీ, నువ్వు కూర్చునే ఆసనమే బంగారు పద్మము. నువ్వు స్వయంగా ఈ భూ మండలానికి నాయికవు. ఇక నీదగ్గర లేనిది నువ్వు చేయలేనిది ఏముందమ్మా, దేవాదులకే నీ దయ అనే భిక్షను ఎన్నో సార్లు కలుగజేసిన తల్లీ నీకు నమస్కారాలు.అమ్మా ఈ బీద బ్రాహ్మణ కుటుంబాన్ని కూడా కరుణతో రక్షించి కాపాడు.

**శ్లో14!! నమోఽస్తు దేవ్యై భృగు నందనాయై**

**నమోఽస్తు విష్ణో రురసి స్థితాయై !**

**నమోఽస్తు లక్ష్మ్యై కమలాలయాయై**

**నమోఽస్తు దామోదర వల్లభాయై !!**

తా : బ్రహ్మ యొక్క మానస పుత్రులలో ఒక్కడైన భృగువను ఋషి యొక్క వంశమునం దుద్భవించినదియు, తన భర్తయైన విష్ణుమూర్తి యొక్క వక్షఃస్థలము నధివసించి యున్నదియు, కమలములే తన ఆలయములుగా గలదియునగు శ్రీముకుందప్రియాదేవికి నమస్కారము.

<u>వివరణ:</u> ఈ శ్లోకంలో శంకరులు అమ్మవారి కారుణ్యానికి అనుగ్రహానికి పరాకాష్టనే సూచించారని చెప్పుకోవచ్చు. అత్యద్భుతంగా ఈ శ్లోకంలో అమ్మవారి సౌలభ్యాన్ని గుర్తుచేసి అమ్మవార్ని నిర్బంధించినంత పని చేసి ముందరికాళ్ళ బంధం వేసేశారు. ఇక్కడ అమ్మవారిని భృగు నందనాయై అని మొదటి పాదంలో కీర్తించారు. ఒకానొక సమయంలో భృగు మహర్షి బ్రహ్మాగారి ఆదేశం మేరకు తపస్సు చేసి లక్ష్మీ దేవిని కూతురిగా పొందారు. ఆ లక్ష్మీదేవి భృగుమహర్షియొక్క తపస్సుకు మెచ్చి కూతురిగా పుట్టి భృగునందన అన్న కీర్తిని కట్టబెట్టింది. దీనికి హేతువేమీలేదు కేవలం పెద్దలు చెప్పిన మాట వినటం తపస్సు చేయటం తప్ప. అదే భృగుమహర్షి మరో

సమయంలో లక్ష్మీ నివాసస్థానమైన విష్ణు వక్షస్థలాన్ని తన కాలితో తన్నాడు. అందువల్ల ఆమె నొచ్చుకుంది కానీ భృగుమహర్షికి ఏ విధమైన హానీ చేయలేదు. తనకి అపకారం చేసిన మహర్షికి కూడా భృగునందన అన్న కీర్తినిచ్చిన తల్లి శ్రీ మహాలక్ష్మీదేవి. అటువంటి తల్లికి నమస్కారము. అమ్మా నువ్వేమో కమలాలయవు, పద్మమే ఆలయంగా కలదానివి. పోనీ పద్మమేమైనా గొప్ప గొప్ప వృక్షాలకు పూస్తుందా అంటేలేదు, పన్నీటివంటి జలాలలోనూ పూయదు. ఏమి కారుణ్యమమ్మా మీది ఎవ్వరూ వద్దనుకునే బురదలో పుట్టిన తామరపువ్వు నీ ఇల్లా!!!!... అంతకారుణ్యం సౌలభ్యం కలిగిన తల్లీ నీకు నమస్కారము. మరి మీ ఆయనో దామోదరుడు. ఏమీ తెలియని గోపకులంలో పుట్టి గోపకాంత ఐన యశోద తన కొడుకైన కృష్ణుడు అల్లరి చేసి వెన్న దొంగతనాలు చేస్తున్నాడని పాలు , పెరుగు చిలికే పాత తాళ్ళు తీసుకొచ్చి బ్రహ్మాండమంతానిండిన పరమాత్మని కట్టబోయి భంగపడపోతుంటే, తల్లి యశోద బాధచూసి తల్లిని గెలిపించటానికి సమస్త లోకనాధుడైన సమస్తమూ తానైన పరబ్రహ్మం ఐనా శ్రీకృష్ణుడుగా దొరికి పోయి నడుముచుట్టూ తాళ్ళతో కట్టించుకున్నాడు. అబ్బబ్బబ్బా...ఏమి సౌలభ్యం తల్లీ మి ఇద్దరిదీ. ఇటువంటి సౌలభ్యం కరుణ ఇంకెక్కడుంటుందమ్మా. అంత సులభుడి మనోరాజ్ఞివైన నీకు నమస్కారములు.

<u>సందర్భం ప్రకారం:</u> అమ్మా సరే వీరు పూర్వ జన్మలోనో గతంలోనో నీపట్లనో స్వామి పట్లనో అపచారం చేసారు అందుకు ఇప్పుడు వారినుద్ధరించడం కుదరదు అనుక్కుందామా. అమ్మా నువ్వు విష్ణువక్షస్థలవాసినివి అదేవిష్ణువక్షస్థలాన్ని తన్నిన భృగువంశంలోపుట్టి భృగునందన అన్న పేరుతో భృగువంశాన్ని అనుగ్రహించి ఇప్పటికీ భృగువారంనాడు పూజలందుకుంటున్నదానివి. వీరు నీపట్ల ఏదైనా తప్పచేస్తే కడుపులోపెట్టుకుని వారిని రక్షించు తల్లీ. నువ్వలా దిగివచ్చి రక్షించగలవనడానికి సాక్ష్యం ఏంటో తెలుసా, నువ్వు అందరికీ అందుబాటులో ఉండడానికి బురదలో పుట్టిన తామరనే ఆలయంగా చేసుకుని ఉంటావు. మరి మీ ఆయనో ఆయన సౌలభ్యమేమని చెప్పగలం భాగవతమంతా అదేకదమ్మా, ఆ సౌలభ్యంతోనే, దయతోనే దామోదరుడయ్యాడు. అటువంటిమీకు నమస్సులు.

**శ్లో15!! నమోஉస్తు కాంత్యై కమలేక్షణాయై**

**నమోஉస్తు భూత్యై భువన ప్రసూత్యై !**

**నమోஉస్తు దేవాదిభి రర్చితాయై**

**నమోஉస్తు నందాత్మజ వల్లభాయై !!**

తా : కమలముల వంటి కన్నులు గల కాంతిస్వరూపురాలికి నమస్కారము. ప్రపంచములను గన్న తల్లికి వందనము. దేవాదులచే పూజింపఁబడు తల్లికి ప్రణామము. నందకుమారుడైన శ్రీకృష్ణుని ప్రియ యగు శ్రీదేవికి నమస్కారములు.

<u>వివరణ:</u> కమలముల వంటి కన్నులు కలిగి, కమలముల కాంతులవంటి చూపులు కలిగిన తల్లికి నమస్కారము. కమలములు కాంతి వంతంగా ఉన్నా చల్లగా ఉంటాయి అటువంటి చూపులు కలిగిన తల్లికి, కామాక్షికి నమస్కారము. సకల జగములను కన్నతల్లి, పిపీలికాది పర్యంతం అన్ని జీవరాశులకూ తల్లి ఐన

జగన్మాతకు వందనం. దేవ, గంధర్వ, కిన్నెర, కింపురుష, దానవ, రాక్షస, మానవులు ఇత్యాది అన్ని జాతులవారిచే పూజింపబడు మాతకు నమస్కారము. నిరతిశయ ఆనంద స్వరూపుడైన ఆ నంద కుమారుడు శ్రీకృష్ణుని భామ అగు శ్రీ లక్ష్మీ దేవికి నమస్కారం.

సందర్భం ప్రకారం: అమ్మా అమాయకులు ఐన గోపకులంలో నందునికి కొడుకుగా పుట్టి, అందరికీ ఆనందాన్ని పంచి, భక్తుల కోరిక మేరకు తనను తానే ఇచ్చుకున్న శ్రీకృష్ణుని అర్ధాంగివి కదమ్మా మరి ఈ బీద బ్రాహ్మణ కుటుంబానికి వారి దారిద్రం తీరేంత ఐశ్వర్యాన్ని కలుగజేయవా.. ధర్మం కోసం, అర్జునుని కోసమని తనను తానే ఇచ్చుకుని అర్జునుని రథసారధిగా మారి రథాన్ని నడిపే ఉద్యోగం చేయలేదా, వీరు కూడా ధర్మ పథంలోనే ఉన్నారు ,వారిని రక్షించు తల్లీ! ఆ నాడు, దరిద్రంతో ఉన్నా ధర్మం తప్పక స్వాధ్యాయం చేసుకుంటున్న కుచేలుని చేతి గుప్పెడు అటుకులు తిని వారి దారిద్రాన్ని తొలగతోయలేదా, మరి ఈ నాడు వీరు ధర్మం తప్పక ఇంటికి వచ్చిన బ్రహ్మచారి ఐన అతిథి చేతిలో ఉసురిక వేశారే, మరి వీరి దరిద్రాన్ని నువ్వు తీయాలి కదా, కమలముల వంటి చల్లని చూపులున్న తల్లీ, అన్ని జగాలకూ నువ్వే కదా తల్లివి, నిన్ను దేవాదులందరూ పూజిస్తారే, అందరికీ అన్నీ ఇవ్వగలిగిన నువ్వు వీరికి కూడా ఐశ్వర్యాన్ని కటాక్షించమని కోరుతూ ప్రణమిల్లుతున్నాను.

**శ్లో16!! సంపత్కరాణి సకలేంద్రియ నందనాని**
**సామ్రాజ్య దాన నిరతాని సరోరుహాక్షి !**
**త్వద్ వందనాని దురితాహరణోద్యతాని**
**మామేవ మాత రనిశం కలయంతు మాన్యే !!**

తా : దేవతలందరిలోను మాన్యురాలవైన ఓ మహాలక్ష్మీ ! మేము నీకు చేయు ఈ వందనములు మాకు సంపదలను గలిగించునవి. మా యొక్క ఇంద్రియములను సుఖపెట్టునవి, పాపములను పోగొట్టగలిగినవి . అవి రాజాధిరాజత్వమును సైతము ప్రసాదింప గలిగినవి. ఆ చూపులు నాపై ఎల్లప్పుడు ప్రసరించి యుండు గాక !

వివరణ: కమలములవంటి చల్లని చూపులున్న తల్లీ, అందరి చేత గౌరవింపబడి పూజించబడే తల్లీ! నీకు ఇవే మా నమస్కారములు. అమ్మా మా ఈ నమస్కారంతో మాపై పడే నీచూపులు మాకు సకల సంపదలను కలిగించునవి కావాలి. ఆ సంపద అనుభవైకవేద్యమై మాయొక్క అన్ని ఇంద్రియాలను తృప్తి పరచగలగాలి, అమ్మా అలానే ఆ సంపదలు మాకున్న పాపములను తీయటానికి పనికిరావాలి (అంటే ధర్మబద్ధమైన సంపాదనేగాక, ధర్మ బద్ధంగా ఖర్చు చేయగలుగు శక్తి కూడా కావాలి). ఒక్కసారి సంపాదన వచ్చాక మళ్ళీ అధర్మ మార్గం తొక్కటం మళ్ళీ ఆ దోషాలవల్ల పాపాలు కలగడం వంటివి ఉండకూడదు. వచ్చిన ఐశ్వర్యం ధర్మ కార్యాలకి, ధర్మ బద్ధంగా ఇంద్రియ సుఖాలకి ఖర్చు అవ్వాలి తప్ప ఇంకో విధంగాకాదు.అటువంటి ప్రభావం ఉన్న నీ చూపులు నిత్యం మాపై ప్రసరించుగాక, అవి ఎల్లప్పుడూ మమ్ములని చంటిబిడ్డని సాకు తల్లి చూపులవలె మాపైననే ప్రసరించు గాక.

సందర్భం ప్రకారం: అమ్మా ! ఎంతో గొప్పనైన చూపులు కలిగి, సకల జీవులచేత పూజించబడే తల్లివి నువ్వు. అమ్మా మా నమస్కారములచే నీ చూపులు ఈ బీద బ్రాహ్మణ కుటుంబం మీద వర్షించు గాక, అమ్మా ఆ నీచూపులు సకల సంపదలను వీరికి కలిగించేవి ఆయ్యి, అవి వారి దురితాలను నాశనం చేసేవి అవ్వాలి, వారికి నీవిచ్చే ఐశ్వర్యం ధర్మబద్ధంగా అనుభవైకవేద్యం అవ్వాలి దానితో వారికి పూర్వజన్మ పాపాలు తొలిగి తిరిగి ఇటువంటి కష్టం ఎన్నడూ రారాదు. అమ్మా నీ చూపులు వీరిని ఎల్లప్పుడూ చంటిపిల్లలను రక్షించు తల్లివలె వారిని కాపాడు గాక.

**శ్లో17!! యత్కటాక్ష సముపాసనా విధిః**
**సేవకస్య సకలార్థ సంపదః !**
**సన్తనోతి వచనాంగ మానసైస్త్వామ్**
**మురారి హృదయేశ్వరీమ్ భజే !!**

తా : హే మహాలక్ష్మీ ! ఎవరి కటాక్షమును గోరుచు మనసా, వాచా, కర్మణా ఉపాసించిన భక్తులకు అష్టైశ్వర్యములు సమకూడునో, అట్టి హరిప్రియవైన నిన్ను శ్రద్ధతో భజించుచున్నాను.

వివరణ: అమ్మా! మురారి హృదయేశ్వరీ, ఒకరికి ఇచ్చుటేకాని నాది అని దాచుకోవడం ఎరుగని వారిని తన హృదయంలో పెట్టుకునే శ్రీహరి హృదయ రాజ్ఞీ! ఎవరు నిన్ను మనసా వాచా కర్మణా సేవచేస్తూ ఉపాసిస్తున్నారో వారికి నీకటాక్షమువలన సకల ఐశ్వర్యములు కలుగును. అటువంటి తల్లివైన నిన్ను నేను సర్వదా పూజించెదను.

సందర్భం ప్రకారం: ఈ శ్లోకం "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ" అను శరణాగతి వంటిది, ఈ బ్రాహ్మణ కుటుంబానికి ఐశ్వర్యముని ఇంకేదేవతలెవరైనా ఇవ్వగలరు అని అంటావేమో నిన్ను పూజించి శరణుజొచ్చి నిన్ను స్తుతించిన వారికి ఐశ్వర్యములనిచ్చే తల్లివి నువ్వేకాబట్టి నీ గురించి చేసిన ఈ స్తోత్రము ద్వారా నీ కటాక్షముని వీరిపై వర్షించి వీరి దారిద్రాన్ని ధ్వంసనం చేయి.

**శ్లో18!! సరసిజ నయనే సరోజ హస్తే**
**ధవళ తమాంశుక గంధమాల్యశోభే !**
**భగవతి హరివల్లభే మనోజ్ఞే**
**త్రిభువన భూతికరి ప్రసీద మహ్యామ్ !!**

తా : అందమైనదానా ! కమలములవంటి కన్నులును, చేతులును గలదానా ! మిక్కిలి తెల్లనైన దువ్వలువల తోడను, గంధపు పూత తోడను, పూల దండల తోడను ప్రకాశించుదానా ! విష్ణుమూర్తికి ప్రేయసివైనదానా ! ముల్లోకములకున్ను సంపదల ననుగ్రహించుదానా ! హే భగవతీ ! శ్రీ మహాలక్ష్మీ ! నాయందు సంప్రీతురాలవు కమ్ము !

వివరణ: కమలములవంటి కన్నులు కలిగి, కమలములను చేతిలో పట్టుకొను, తెల్లటి పట్టు పుట్టంకట్టుకుని, చక్కని సువాసనలు కలిగిన పువ్వులను ధరించి ప్రకాశ వంతముగా మెరయునట్టి తల్లీ మా యందు ప్రసన్నురాలవు కమ్ము. అమ్మా! భగవతి, సాక్షాత్ పాపములను హరించు శ్రీ హరి ప్రియురాలవు మనోహరమైన దానవు, మూడులోకములకు ఐశ్వర్యాన్ని ఇచ్చుదానవు, మాయందు ప్రసన్ను రాలవు కమ్ము.

సందర్భం ప్రకారం: ఇది కూడా పైన చెప్పిన శ్లోకం వంటిదే, అన్ని లోకములకు ఐశ్వర్యాన్ని ఇచ్చే తల్లివి, పద్మమునందు వసించి, పద్మ నేత్రములు కలిగి, పద్మములను హస్తములలో కలిగిన నీవు పరమ మంగళ స్వరూపినివి, ఆ మంగళ స్వరూపముతో సర్వమంగళగా నిలచిన ఈ పేద బ్రాహ్మణి కుటుంబముపై నీ కరుణను ప్రసరించి మా యంది ప్రసన్నురాలవు కమ్ము.

**శ్లో19!!దిగ్ఘస్తిభి: కనక కుంభ ముఖావసృష్ట**
**స్వర్వాహినీ విమల చారుజల ప్లుతాఙ్గీమ్ !**
**ప్రాతర్న మామి జగతాం జననీ మశేష**
**లోకాధినాథ గృహిణీ మమృతాబ్ధి పుత్రీమ్ !!**

భావం: తల్లీ సమస్త జగత్తుకూ తల్లివైననిన్ను ప్రాత: కాలముననే స్మరించుచున్నాను. తెల్లని వస్త్రములు ధరించి, చందనాది అంగరాగములు పూసుకుని, సుకుమారమైన పూల దండలు ధరించి ఉన్న ఓ తల్లీ నీకు నిత్యమూ ప్రాత: కాలమునందు నమస్కరిస్తున్నాను. తల్లీ నీ ఐశ్వర్యమునేమని కొలచెదను, దిగ్గజముల భార్యలైన ఆడ ఏనుగులు బంగారు కలశములతో ఆకాశ గంగను పట్టితెచ్చి ఆ జలములతో నిత్యమూ నిన్ను అభిషేకము చేస్తూ ఉంటాయి. ఐశ్వర్యములలో హద్దుగా మదము కలిగిన ఏనుగులను వాకిటకట్టుకున్న వాని ఐశ్వర్యమును చెబుతారు, తల్లీ మరి నీకో దిగ్గజముల భార్యలే స్వయంగా నిత్యమూ అభిషేకం చేస్తూ ఉంటాయి. తల్లీ ముల్లోకాలలోనూ కల గొప్పనైన ఐశ్వర్యమును ప్రసాదించగల తల్లివి, నామీద ప్రసన్నురాలవు కమ్ము.

**శ్లో20!! కమలే కమలాక్ష వల్లభే త్వం**
**కరుణా పూర తరఙ్గితైరపాఙ్గై: !**
**అవలోకయ మా మకించినానామ్**
**ప్రథమం పాత్ర మకృత్రిమం దయాయా: !!**

తా : అమ్మా ! కమలాదేవీ ! దరిద్రులలోకెల్ల దరిద్రుడను నేనే. అందుచేత నీ కృపకు అందటి కంటె ముందు పాత్రుడనైనవాడను నేనే. నా మాటలలో నటన (కృత్రిమత్వము) లేదు. కనుక నీ కరుణాపూరిత కటాక్షముల (ఓరచూపుల) తో నన్నొకమారు చూడుము తల్లీ ! దేవీ ! ముకుందప్రియా !

వివరణ: అమ్మా కమలాదేవీ! పద్మ పత్రముల వంటి కన్నులు గలనీ కళ్ళు పద్మ పత్రముల వలె చల్లని తనము ఆర్ద్రత కలదానవు. సహజముగా దీనుల యెడ అపార దయగలిగిననీవు, నీ సహజ స్వభావముచే దీనులపై దయను వర్షిస్తావు. అటు వంటి దయకు నేను పూర్తిగాపాత్రుడను, నీ దయకు పాత్రులైన దీనులలో మొట్ట

మొదటి వాడను కాబట్టి నీ దయను పరిపూర్ణ కరుణతో కూడిన క్రీగంటి చూపుతో ముందుగా నామీద వర్షించమ్మా!.

సందర్భం ప్రకారం: అమ్మా, దీనులయందు సహజంగా కారుణ్యము కలదానవైన నీవు, నీ చల్లని చూపులో పద్మ పత్రములవలె తడి (ఆర్ద్రత) కలదానవు ఐన నీవు ఈ దీనులైన బ్రాహ్మణ కుటుంబమునకు కల దీనతను నీ దయ అనే కరుణార్ద్రపు క్రీగంటి చూపులను ప్రసరింపచేసి వారి దీనతను పోగొట్టు. అమ్మా నువ్వు కాపాడవలసిన దీనులలో మొట్టమొదట వరసలో ఉన్న దీనులు వీరు, వీరిని రక్షించి అనుగ్రహించు.

**శ్లో!! స్తువంతి యే స్తుతిభి రమూభి రన్వహం**

**త్రయీమయీం త్రిభువన మాతరం రమామ్ !**

**గుణాధికా గురుతర భాగ్య భాజినో**

**భవంతి తే బుధ భావితాశయా: !!**

తా : ఎవరైతే ఈ స్తుతిపూర్వములైన శ్లోకములతో వేదమాతయు, జగజ్జననియు అయిన శ్రీ మహాలక్ష్మీ భగవతిని ప్రతి దినమున్ను స్తోత్రము సేయుదురో, వారు తమ సద్గుణములచేత ఇతరుల కంటె అధికులై, విద్వాంసుల చేత గౌరవింపఁబడుచు మిక్కిలి విస్తారములైన సౌభాగ్య భాగ్యములతో విలసిల్లగలరు.

ఫలశ్రుతి: ముల్లోకముల తల్లి, సర్వవేద స్వరూపిణి విష్ణుభగవానుని విశ్రాంతి స్థానమైన లక్ష్మీ దేవిని ఎవరైతే పైన చెప్పిన శ్లోకములతో ప్రతిరోజు స్తుతిస్తున్నారో వారు సద్గుణ సంపన్నులై, అధిక భాగ్యవంతులై లోకములో విద్వాంసుల మనస్సులయందు ఉండు భావనలను కూడా ఆకర్షించే వారగుదురు.

**శ్లో!! కనకధారా స్తవం యత్ శంకరాచార్య నిర్మితమ్ !**

**త్రిసంధ్యం య: పఠేన్నిత్యం స కుబేర సమో భవేత్ !!**

తా : జగద్గురు శ్రీ ఆదిశంకరాచార్యులవారు కూర్చిన ఈ కనకధారా స్తవమును దినమునకు మూఁడుసారులు - అనఁగా ఉదయ, మధ్యాహ్న, సాయం సంధ్యలలో - పారాయణము చేసినవారు కుబేరునితో సమానమైన సంపదలను పొందగలరు.

**ఓం ఓం ఓం**

నాలో భక్తిలోపమైనా, శక్తి లోపమైనా, నా బుద్ధిచాంచల్యముచేత ఇందులో ఏ ఇతర దోషమైనా అన్నీ జగత్తుకు తల్లితండ్రులైన మీ దయార్ద్రదృక్కులచే నాలోని అన్ని దుర్గుణములు, పై పేర్కొన్న విషయములోని అన్ని దోషములు తొలగింపబడి సర్వమూ మీ పాదసేవగా మారుగాక అని సాష్టాంగ ప్రణామాలు చేస్తూ...

హే లక్ష్మీ నారాయణా! మాకందరకూ మోక్షార్హతకు కావలసిన భక్తి జ్ఞాన వైరాగ్యాలు, ఇహంలో ధర్మ కార్యాచరణమునకు కావలసిన పురుషార్థములు శంకరుల భిక్షగా మీవల్ల కలిగి లోకములు సుభిక్షముగా ఉండుగాక.

లోకాస్సమస్తాస్సుఖినోభవంతు, గోబ్రాహ్మణేభ్యశ్శుభంభవతు. శ్శాంతి శ్శాంతి శ్శాంతి:

